# వేపచెట్టు

హిందూదేశమున సర్వసాధారణమైన వృక్షరాజములలో వేపచెట్టు ఒకటి. ఆచెట్టులేని పల్లె హిందూదేశమున గానరాదనుట అతిశయోక్తి గాదు. చింతాలమ్మ, నూకాలమ్మ, పోలేరమ్మ, మారెమ్మ, దండుమారెమ్మ మొదలగు నామములతో అమ్మవార్లని సిర్దేశించి గ్రామీణులు కొలుచుట భారతదేశమున అనంతకాలమునుండియు సాగివచ్చుచున్న ఆచారము. ఇట్లు కొలువబడు గ్రామదేవతకు ప్రతి గ్రామమున పెద్దదియో చిన్నదియో ఒకగుడియుండుటయు దాని ముందు వినియమముగా నొక వేపచెట్టుండుటయు సర్వజనవిదితమైన సంగతి. పొంగు, ఆటలమ్మ, మశూచికము మొదలగు వ్యాధులు గ్రామదేవతల ప్రభావమున మనకు గల్గుచున్నవనియు, ఆరోగనివారణకు అమ్మవార్లకు ప్రియకరమైన వేపమండలతో విసరుట, వేపాకు ముద్దగానూరి ఒడలికిపట్టించుట మొదలుగా వినియోగించుట మంచిదనియు మనవారి నమ్మకము. ఈనమ్మకమునందలి సత్యము ఎట్టిదైనను వేపచెట్టునందు ఆరోగముల నుపశమింపజేయు ఓషధీగుణము అద్భుతముగను అనల్పముగను నున్నమాట ముమ్మాటికి సత్యము.

ఆంధ్రులమగు మనము సంవత్సరాదినాఁడుగ్రహించు వులలో వేపపువ్వు ప్రముఖస్థాన మాక్రమించుచున్నది. క్రొత్త చింతపండు, మామిడిపిందెల బద్దలు, చెఱుకు బద్దలు లేక బెల్లము, వేపపువ్వు మొదలగు వసంతప్రకృతి నూతనముగా నొసంగెడు పదార్థములను కలిపి తయారుచేసిన ప్రసాదము ప్రథమమున స్వీకరించి కాని ఆనాఁడు మనము మఱేపనులకు ఉపక్రమించము. జీవితము సుఖదుఃఖమిశ్రితమనుటకు నిదర్శనముగా ఆర్యులగు ఆంధ్రులు చేదుగల నింబకుసుమమును; తీపి, పులుపుగల తదితర పదార్థములను మిశ్రముచేసి తిను ఆచారమును నెలకొల్పిరని లోకజ్ఞులగు మనవారు కొందఱు చెప్పుచున్నను గాని మాకామాట రక్తికట్టదు. నింబకుసుమభక్షణము శరీరారోగ్యమును సంపాదించునది గావున మతసంప్రదాయములను ఆరోగ్యసూత్రములతో మేళవించిన మనపెద్దలీయాచారమును నెలకొల్పియుందురని మాయూహ. సంవత్సరాదినాఁడు ఎట్లుచేసిన సంవత్సరముపొడుగున నట్లు చేయుదురను నమ్మకమును జనులలో పాదుకొల్పి ఏడాది పండుగనాఁడు నింబకుసుమభక్షణమును విధించి సంవత్సరముపొడుగున మనవారిచే నది తినిపించునట్లు జాతీయాచారమును దిద్దిన మన ప్రాచీనుల ప్రతిభాప్రాగల్భ్యములు వర్ణనాతీతము గదా!

అయితే ఒక సంగతి. ఇప్పుడు మనము మనజాతీయాచారములయెడ గౌరవములేక ఉన్నాము. అగుటనే వ

జాతీయారోగ్యము బగ్గింపాడుగ పాడై యున్నది. కూలియున్న జాతీయారోగ్యమును కూడదీయవలయునన్న తిరిగి మనవారిలో ఓషధీజ్ఞానము పెంపొందింపవలసియున్నది. అందుకని ఇంతకు ముందు తులసి, బిల్వ అను మూలికలనుగూర్చి వ్రాసి యున్నాము. ప్రస్తుతము మనవారికి సుపరిచితమైన వేపచెట్టు మహిమ వివరించి వర్ణించుటకు దొరకొనుచున్నాము.

వేపచెట్టునకు సంస్కృతమున అనేకగుణములనుబట్టి నామములు ఏర్పడియున్నవి. అందు కొన్నిటి నిచ్చటవివరించు చున్నాము—నింబ, అరిష్ట, సర్వతోభద్ర, హింగునిర్యాస, మాలక, పిచుమర్ద, పిచుమంద, పక్వకృత్, పూయారి, ఛర్దన, అర్కపాదప, పూకమాలక, కీటక, విబంధ, కైటర్యా, వర త్వచ, ఛర్దిఘ్న, పారిభద్రక, ప్రభద్ర, కాకఫల, కీటేష్ట, సుమనా, విశీర్ణపర్ణ, యవనేష్ట, నేతా, పీతసారక, శీత, రాజ భద్రక, సుతిక్త, కుష్ఠాహా, దేనదత్త, రవిసన్నిభ, సూర్యక, నియమన, శీతపర్ణ, సుతిక్తక, ప్రియసార, రవిప్రియ, శీర్ణదళ, నింబక, శుకప్రియ. ఈనామముల ఉత్పత్త్యర్థమును పరిశీలించితి మేని వేపచెట్టుయొక్క నానాగుణగణాదులు విస్పష్టమగును.

ఈచెట్టు అరవభాషయందు వేప్పమరం అనియును; మళ యాళమునందు వేప్పు అనియును; కన్నడమునందు బెవేవు అనియును; వంగభాషయందు నీమ్‌గచ్ అనియును; హిందీ యందు నీంబ అనియును వ్యవహరింపబడుచున్నది.

వేపచెట్టునందు అయిదుజాతులు గలవు. ఆయాజాతి వేపచెట్లకు సంస్కృతభాషయందు నింబ, మహానింబ, నేపాల నింబ, గిరినింబ, భూనింబ అను నామములు యేర్పడియున్నవి. నింబయనిన సర్వసాధారణమైన వేపచెట్టు. మహానింబవృక్షమునకు తెనుగున పెనువేపచెట్టు లేక పియ్యావప అను పేళ్లు గలవు. నేపాలనింబ యనగా మనము తురకవేపచెట్టు అని వ్యవహరించువృక్షమే. మఱియొక గిరినింబయనిన పచనకార్యములందు మనము నిత్యము అత్యంతప్రీతితో నుపయోగించుకొను కరివేపచెట్టే. మనము నేలవేము అని వ్యవహరించునదియే సంస్కృతమున భూనింబయనునది.

ఈఅయిదురకముల వేపచెట్లయందును సర్వసాధారణమైనదియు, జనులకు సుపరిచితమైనదియు నగు నింబవృక్షమే ప్రధానమైనది. కావున మున్ముందు దానినిగూర్చియే సమగ్రముగ వర్ణించి వివరించుచున్నాము.

వేప పెద్దవృక్షముల జాతికి చెందినది. ఇది వనవృక్షములలో ప్రాయికముగా పేర్కొనబడుచున్నది. జ్వరఘ్నమగు ఓషధీవిశేషమగుటచే దీనికి ఆయుర్వేదవైద్యవిధానము నందు అమోఘమగు స్థానముగలదు.

వేపచెట్టు ఉష్ణప్రదేశములలో చక్కగను, ప్రోదిగను పెరుగును. హిందూదేశము మిక్కిలి ఉష్ణదేశము గావుననే వేప యిచ్చట సర్వత్ర గానవచ్చుచున్నది. ఇది శీతలదేశములలో

వర్ధిల్లజాలదు. ఒకవేళ అచ్చటివారు శ్రద్ధచేసి దీక్షవహించి పెంచినను ఉష్ణదేశములందువలె విరివిగను, ప్రోదిగను ఎదుగ జాలదు. కావుననే నెల్లూరు, గుంటూరు మొదలగు ఉష్ణప్రదేశములందు ఉన్నట్లుగా నీలగిరి, బెంగుళూరు, మలబారు మొదలగు శీతలప్రదేశములందు నింబవృక్షములు గానరావు.

వేపచెట్టు వినియోగము అనంతమైయున్నది. వేపమాను గట్టికొయ్యలను ఇంటిదూలములకు, తలుపు చెక్కలకు ఉపయోగించెదరు. వేపమ్రానునందు క్రిమినాశనకరమగు పదార్థమును, గంధకపదార్థమును విశేషముగ నున్నందున దీని చెక్కలకు, కొయ్యలకు చెదలుగాని పురుగులుగాని పట్టవు. ముదురు వేప చెక్కలతో తయారుచేయబడిన పెట్టెలు, బీరువాలుమొదలగు వానియందుంచు బట్టలకు చిమటలు, పురుగులు పట్టజాలవు. వేపదూలములతో నిర్మింపబడిన గృహములకు పిశాచబాధ సోకదనియు, గ్రహపీడ యుండదనియు హిందువుల గాఢమైన నమ్మకము.

ఎట్టిపనికి వినియోగింపవలసివచ్చినను ముదురు వేప చెట్టుయొక్క భాగములే సర్వోత్కృష్టములును, సమగ్రఫల దాయకములును అయిఉన్నవి. చేవదేరియుండిన వేపచెట్టు యొక్క గర్భము ఔషధప్రయోగములకు మిక్కిలి యోగ్యమైనది. నూఱు సంవత్సరముల నాటి వేపచెట్టు అమృతోపమానమని వస్తుగుణతత్త్వవేత్తలగు పెద్దలు చెప్పుదురు. వేప

చెట్టునందు అమోఘమైన క్రిమిసంహారకగుణము ఉన్నందున కేవలము అంటుజాడ్యములగు తీట, కుష్ఠు మొదలగు చర్మ వ్యాధులందు దీని వినియోగము కొలదులు పెట్టరాకయున్నది. మశూచికము పోసిన వారి పడకయందు వేపాకులను పఱచెదరు. వారియింటి తలవాకిటను వేపాకులతో తోరణములు కట్టెదరు వేపాకును మెత్తగనూరి రోగియొక్క శరీరమునకు పూయుదురు. వేపాకునూరి ముద్దచేసి చిన్నచిన్న ఉండలుగా నొనర్చి ప్రసాద మనిచెప్పి రోగిచే తినిపించెదరు. ఘోరవ్యాధియగు మశూచి కము తన భయంకరాకారము రోగిశరీరమునందు ముద్రించి పోకుండుటకును, ఆవ్యాధి త్వరలోనయమగుటకును పై నివివరింప బడిన వేపాకు సంబంధమైన ప్రక్రియలు బాగుగాపనిచేయునని ఆంగ్లవైద్యవేత్తలుకూడ నంగీకరించియున్నారు.

గృహములందు ఆవరించియుండు దుర్గంధమును పాఱ ద్రోలుటకును, ఇండ్లనంటియుండు క్రిమికూటము నాశనమగుట కును వేపాకుతో ధూపమువేయుట హిందువులలో అనుశ్యూత ముగ వచ్చుచున్న ఆరోగ్యమార్గము. సారకాయలమ్మ, గాదలమ్మ, దద్దమ్మ, ఆటలమ్మ, మారెమ్మ మొదలగు అమ్మ వార్ల ప్రోద్బలమున సంభవించునని మనవారు నమ్ము మశూచి కాది రోగములు సోకినప్పుడు వేపాకును పసుపును కలిపినూరి రోగియొక్క శరీరమునకు పట్టించుట మనలో చిరకాలమునుండి వచ్చుచున్న ఆరోగ్యకరమైన ఆచారము. ఎంతకాలమునకు

మూనుదలపట్టని మొండి కురుపులకు వేపాకునూరి కట్టినచో నవి శీఘ్రముగ నయమగును. వేపచిగురును దినదినక్రమమున ప్రాతః కాలమున సేవించుచుండువారు సర్వకాలములందు ఆరోగ్య భాగ్యము అనుభవించుచుందురని ఆయుర్వేదవైద్యవేత్తల సునిశ్చితాభిప్రాయము.

తపస్వులును, సన్యాసులును, యోగాభ్యాసకులును, ప్రకృతిమార్గోపజీవులును వేపాకును ప్రతినిత్యము ప్రసాదముగ తిను అలవాటు సలవఱచుకొని దీర్ఘకాలము సుఖజీవనులై వెలయుచున్నారు. వేపాకును ప్రతిదినము కొంచము కొంచముగ నమలితిను అలవాటుచేసికొన్నవారికి క్రమముగా నది నోటికి చేదుగానుండక తియ్యదనమునొందును. 'తినగ తినగ వేము తియ్యనుండు' అను వేమన్నగారి సుప్రసిద్ధవచనము అక్షరాస్యులగు ఆంధ్రులకు సుపరిచితమైనదేగదా!

వేపాకును నిత్యక్రమమున తినువారికి వారి జీవితకాలమున ఎట్టిరోగమును గలుగదు. అంతియేగాక అట్టివారు సర్పదష్టులైనను ఎట్టి ప్రమాదమును గల్గనేరదు. ఏమనగా వారికి విషము శరీరమునందు ప్రసరింపకుండుటయే కారణము. ఆహా! ఏమి వేపచెట్టుయొక్క అమోఘమగు ఓషధీగుణము!

ముదురువేపచెక్కతో తీసిన గంధమును శరీరమునకు పూసుకొనిన ఒడలు పేలుట, మూగతీట, సోబె, మంగు, తామర మొదలగు చర్మవ్యాధులు నయమగును. వేపగంధమును ఆరోగ్య

సంపాదనార్థమై కొందఱు లోపలికి పుచ్చుకొందురు. ముదురు వేపచెట్టుయొక్క వేరుచూర్ణమును కొద్దిమోతాదుగ లోపలికి పుచ్చుకొనుచుండిన రక్తమును పరిశుద్ధమొనర్చి శరీరమునకు పుష్టికల్గించును; జ్వరమును పాఱద్రోలును; క్రిములను నాశనము చేయును. పసిబిడ్డలకు అజీర్ణమువలన కలుగు పలికపాములను, నులిపురుగుల నాశనముచేయుటలో వేపచెక్క చూర్ణము పెట్టినదిపేరు. వేపచెక్కచూర్ణమును పెద్దవారు సేవించిన అజీర్ణము వలన కలుగు జ్వరములు నిమ్మళించును. వేపచెట్టువేరు, పట్ట, ఆకు, ఈనె, పువ్వు, పిందె, కాయ, పండు, కల్లు, జిగురు ఇవి అన్నియు పలువిధములైన రుగ్మతలను నశింపజేయగలవని ఆయుర్వేదవైద్యశాస్త్రములందు చెప్పబడియున్నది.

వేపఆకు, పువ్వు దేహతత్త్వమును మంచిస్థితికిమార్చి జీర్ణశక్తిని వృద్ధిపఱచును. వేపాకు స్వరసమువలన జ్వరము, అజీర్తి, బలహీనము, పాండువు, క్రిమిరోగము, గండమాల, వ్రణములు, కుష్ఠు మొదలగువ్యాధులు నశించును. నరముల సంబంధమైన తలనొప్పికి (న్యూరాల్జియా) వేపాకును వాడ్చి తలకుకట్టిన బాధతగ్గిపోవును. వేపపువ్వునువాడ్చి తలకుకట్టిన తలలోని పేలు, ఈపి, చుండు నశించును. చీముకారుపుండ్లకు వేపాకునూరిచేసినముద్దనుపట్టించినచో వానినిశోధించి శీఘ్రముగ మానునట్లుచేయును. వేపాకును మోతాదుకుమించి జాస్తిగా తినుచో మత్తు, మైకము, వాంతి, భేదులు ఇవికలుగును.

వేపపట్ట, వేపఈనెలకషాయము వంతుజ్వరమును మాన్పును. జ్వరానంతరముకలుగు బలహీనతకుగూడనిది దివ్యమైన ఔషధము. వేపాకును ఆముదములో వెచ్చచేసి కీళ్లవాపులకుకట్టిన నెమ్మదించును. లేతవేపచెట్లనుండి తీయబడినకల్లు తియ్యగనుండును. దీనిని పులనబెట్టిసేవించిన ఆమాశయసంబంధమైన అజీర్తిని, క్రిములనుపోగొట్టి మంచిఆకలిని కలిగించును; రక్తమును శుద్ధిచేసి వృద్ధిపరచును. వేపకల్లు క్షయ, కుష్ఠు మొదలగు అసాధ్యరోగములనుగూడ కుదర్చజాలియుండునని అనుభవశాలురు చెప్పుచున్నారు. వేపవిత్తులనూనె చేదుగనుండును. ఈనూనెను లోపలకుసేవించిన వాతమునుహరించి ఉద్రేకమును పుట్టించును. చర్మవ్యాధులను, క్రిమిజాడ్యములను, మూలవ్యాధిని, మూత్రవ్యాధిని కుదుర్చుశక్తి, ఓషధీగుణము వేపనూనెయందున్నది. వేపనూనె, ఆననూనె, కుంకాయనూనె సమభాగములుగ తీసికొని కాచి చర్మవ్యాధులకు, కీళ్లనొప్పులకు, వాపులకు, తలనొప్పులకు వినియోగించిన అవి నివారణయగును. వేపనూనెలో గంధకపదార్థముఉన్నకారణమున చర్మవ్యాధులను మాన్పుటలో మంచిమందైయున్నది.

పురిటియింటియందు వేపచమురుతో దీపముపెట్టినచో శిశువులకు బాలగ్రహాదిపీడలు కలుగవని హిందువులకు గాఢమైన నమ్మకముగలదు. నింబతైలముతో ప్రసూతిగృహాములందు దీపములుంచు ఆచారమింకను పల్లెలయందు నిలిచియే

యున్నది. పాశ్చాత్యనాగరికతసోకిన పట్టణములందుమాత్రము ఆయూచారము విస్మృతిగిహాసముపాలై పోయినది.

వేపచెట్టుయొక్క వివిధభాగములను వివిధవ్యాధుల నిర్మూలనమునకై చిరకాలమునుండి ఆయుర్వేదశాస్త్రపారంగతులగు హిందూమహాపురుషులు వాడుచున్నారు. వేపవేరుపట్ట, మానుపట్ట, వేపపిందెలు ఈమూడును నరుసజ్వరములను కుదుర్చుటకును, బలమును కలుగిజేయుటకును పేరుపొందియున్నవి. వేపనూనె, వేపపప్పు, వేపాకు-ఈమూడును చురుకును పుట్టించుటకును, క్రిములను నాశనముచేయుటకును, దుర్గంధమును తొలగద్రోయుటకును ప్రసిద్ధికెక్కియున్నవి. వేపపువ్వు ఉద్రేకపదార్థము. ఆమాశయమును శోధించును. ఆకలిని పుట్టించును. వేపబంకమృదువైన బలకరౌషధము. వేపబంక లోపలికిచ్చిన రక్తవిరేచనములు, ఆమవిరేచనములుకట్టును. వేపబంక పైపూతవలన సడలిపోయిన నరములు బిగువగును. వేపకల్లు అమృతముతో సమానమైనది. వేపచెట్టుయొక్క వివిధాంగములలో వేళ్లపట్టయే—అందును ముదురువేపచెట్లవేళ్లపట్ట—ఔషధప్రయోగములకు యోగ్యమైనది. ఈపట్టయందే రసవీర్యము జాస్తిగనున్నది. వేపాకుకషాయము వ్రణములనుశోధించుటలో 'కార్బాలిక్ లోషను'న కెంతమాత్రమును తీసిపోవదని రూఢిగచెప్పవచ్చును. స్త్రీలకు సంభవించు గర్భాశయసంబంధములైన రోగములందు గర్భపాత్రను వేపాకుకషాయముతో

కడుగుట శ్రేష్ఠమగుపద్ధతి. మూత్రనాళమును కడుగుటకుగూడ వేపాకుకషాయమే చాలమంచిది.

నివాసగృహములపరిసరమున వేపచెట్లుండి వానిగాలి బాహాటముగా సోకుచుండిన జనులకు విషూచిమసూచికాది అంటుజాడ్యములు రానేరవు. అంటుజాడ్యములు రాకుండుటయే గాదు. ఆరోగ్యమును సంపాదించును. ఈవిషయమును దృష్టాంతీకరించుచు అనుభవశాలులగు వైద్యులేమిచెప్పిరో ఒక్కింత పరిశీలింతము. ఆంగ్లేయ, దేశీయవైద్యములయందు సమానప్రజ్ఞ గాంచి మద్రాసునందలి జనరలు హాస్పిటలునందు శస్త్రచికిత్సకుడుగ పనిచేసిన డాక్టరు. మొహిద్దీన్ షరిఫ్‌ఖాన్ బహదూరుగారు వేపచెట్టుమహిమనుగురించి యిట్లు చెప్పియున్నారు:—

“నేను నివసించు ఇంటి చుట్టుప్రక్కయందుండువారికి పలుమారు కలరాజాడ్యము సోకుచుండెడిది. గడచిన ఇరువది యైదుసంవత్సరములుగ నాగృహమునందు కలరాదేవత ప్రవేశింపనేలేదు: ఇందుకు కారణము నానివాసగృహముచుట్టు నుండిన వేపమానులమాహాత్మ్యమే అగునని నేను గాఢముగ విశ్వసించుచున్నాను.”

సుప్రసిద్ధులగు డాక్టరు జార్జివాట్ గారు (యం. బి. సి. యమ్.,యఫ్.యల్.యస్.) వేపచెట్టునుగురించి యిట్లు లిఖించుచున్నారు:—

"వేపచెట్టుగాలివలన మనుజులకు మంచిఆరోగ్యము కలుగునను దృఢవిశ్వాసముతో హిందువులు తమ యిండ్లవద్ద ఆచెట్లనునాటి పెంచుచున్నారు. ఐరోపాదేశీయులకుగూడ ఈ నమ్మకమున్నది. వేపచెట్లు విశేషముగానుండిన గ్రామములందు నివసించు జనులు జ్వరములు మొదలగువానివలన విశేషముగ బాధపడుటలేదు. వేపచెట్లులేనిస్థలములందు నివసించువారు తరుచుగ జ్వరపీడితులగుచు వెతలనొందుచున్నారు. ఈవాక్యములు స్వానుభవముతోగూడినవని నమ్ముచున్నాను."

వేపచెట్టుక్రింద ద్వాదశవర్షములు నివసించినచో కుష్ఠురోగముకూడ పోవునని హిందువులకు నమ్మకముగలదు. పాము కఱచినప్పుడు, తేలుకుట్టినప్పుడు వేపమండలతోడనే మాంత్రికులు మంత్రించెదరు. చంటిబిడ్డలకుగలుగు పలువిధరోగములకు మంత్రము ఆవశ్యకమైనపుడు వేపమండలతోడనే మంత్రించుట సర్వసాధారణమైనది. విషముదిగుటకును, దోషములు హరించుటకును మంత్రతంత్రములకంటె వేపాకు మాహాత్మ్యమే హెచ్చుఅనుసంగతి మనవారు చిరకాలముగా గ్రహించియుండవలయును. లేకుండినచో దేశమునందిన్ని రకరకముల చెట్లుండగా అందు ఒక్క వేపచెట్టుయొక్క మండలే మంత్రించుటకు యోగ్యమైనవిగ గ్రహించుటకు కారణముండదు.

వేపాకు శాకవర్గములోకూడ చేరియున్నది. మన ఆంధ్రదేశమున వేపాకును కూరగవండితినకపోయినను వంగదేశమున

ఆదేశజులు లేతవేపచిగురును వంకాయకూరలోను, చేపలకూర లోను కలిపి వండితినెదరు. ఈప్రకారముభుజించిన మంచిఆరో గ్యము కలుగునని బెంగాలీలనమ్మకము. వేపవిత్తులను కొన్ని కొన్ని పచ్చళ్లలో తాళింపుపెట్టుపద్ధతి మన తెలుగుదేశము నందు కలదు. ఎండించిన వేపపువ్వుతో చారుకాచికొనియు, పచ్చడిచేసికొనియు తెలుగువారు వేపపువ్వును ఉపయోగించు చునేయున్నారు. అయిదారు వేపవిత్తులను నేతితోవేయించి చింతపండుపచ్చడిలోవేసి నూరి అన్నముసకలిపి భుజించువాడుక మన ప్రాంతములందున్నది. ఈపచ్చడి వాతహరమైనది.

నూరుసంవత్సరముల ఈడుగల వేప చెట్టు మాను లో (Trunk) 3, 4, వేళ్లు నీళ్లుపట్టుసంతతొట్టును యేటవాలుగ దొలచి అందులో సుమారు శేరుబియ్యము అన్నమువండి చల్లారకమునుపే ఆతొట్టిలోఉంచి ఆవేపచెట్టు పచ్చికట్టితోనే ఆతొట్టిమూతికి సరిపడు బిరడానుజేసి మూతికిబిగించి అందుపైన ఆవుపేడను పూసి ఒక సంవత్సరముంచి ఆకరుదినమున నాయన్న మును తీసిన మెత్తగనుండును. దానిని యెండించి పూటకు పావులాయెత్తు చొప్పున రెండుపూటలు 40 దినములు పుచ్చు కొనిన కుష్ఠురోగము నివర్తియగును. (వస్తుగుణదీపిక)

## వేపకల్లు

నీటికాలువల ప్రక్కనుగాని, నదీప్రాంతములలోగాని యుండు వేపచెట్లయొక్క ప్రక్కవేరును త్రవ్వి సదరువేరు క్రింది

భాగమున నొక చిన్నకుండ నుంచుటకు స్థలమేర్పరిచి ఆవేరు కొనను నఱికి సదరు కుండలోపల వేరునుంచినచో కట్టిపెట్టిన ఒకదినములోపల రెండుమూడు సేర్లు వేపకల్లు కుండలోనికి దిగును. వేరుకు కట్టినకుండలోకి మన్ను పోకుండ కప్పిపెట్టవలయును. వేప చెట్లయొక్క ఆరోగ్యము ననుసరించి కల్లుదిగును. కొన్ని చెట్ల నుండి కల్లుకారదు. తడినేలలోనుండు వేపచెట్లనుండి కల్లు చక్కగదిగును. ఈకల్లును ప్రాతకు 5 తులములు మొదలు 10 తులములవరకు సేవించనగును. దినమునకు రెండుమూడు పర్యాయములు పుచ్చుకొనవచ్చును.

కొన్ని వేపచెట్లనుండి అప్రయత్నముగ కల్లుకారును. ఈకల్లుచెట్టు బోదెనుండిగాని మొదురుకొమ్మనుండిగాని కారును. ఈవిధముగకారు కల్లు స్వచ్ఛమైననీటివలె నుండును. ఈకల్లు రెండు మొదలు నాలుగువారములవరకు ఎడతెగక కారుచునే యుండును. మొట్టమొదట వేపచెట్టు బోదెనుండి జుమ్మనిశబ్దముతో పిచికారి కొట్టినట్టు కల్లుధార చిమ్ముచుండును. చిమ్ముట చెట్టుయొక్క యితరభాగములనుండి కల్లుకారుటకు ఆరంభించు వరకు యీజుమ్మను శబ్దము ఆగదు.

ఒకమారు చెట్టునుండి 3, 4 స్థలములనుండి కల్లుకారుట ఆరంభమైనతోడనే శబ్దముమాని సన్నగ కల్లు కారుచుండును. సుప్రసిద్ధుడగు జె.సి. బోసు శాస్త్రవేత్త వృక్షముల అనుగునుండి చెట్లలోని ద్రవపదార్థము పైభాగమునకు పారుటకు వంపు

(పిచికారి)మాదిరి యొకశక్తి వృక్షములలో యున్నటుల కనుగొనెను.

## వేపజిగురు

వేపచెట్టునుండి చిక్కని ద్రవపదార్థముకారి గాలితగల గనే యది గట్టిపడి చెట్టుకే అంటుకొనియుండును. ఇది మృదువు గను, మెత్తగను ఉండును. దీనిని జిగురుయని పిలుచు చున్నారు. ఈజిగురు నీటిలోకలిపిన కరిగిపోవును. ఎండినబంక చక్కగా పొడియగును. ఒకభాగపు వేపజిగురుపొడిలో నాలుగు భాగములునీరుబోసి నాననిచ్చి నలియగొట్టి పూటకు ఒకటి రెండు తులముల జిగురునీరును సేవించవచ్చును. పావలాయెత్తు వేపజిగురుచూర్ణమునకు సమముగా పంచదారను కలిపియిచ్చిన రక్తగ్రహణి తగ్గును. విస్ఫోటకము, పొంగు మొదలగు వ్యాధులు తగిలిన పిల్లలకుకలిగెడు జిగటవిరేచనములు, రక్తవిరేచనములు వీటికి వేపజిగురు నల్లమందు సమభాగములుగనూరి, మాత్రలు చేసి పూటకు ఒకటిచొప్పున ఇచ్చిన నెమ్మదికలుగును. బిడ్డ లకు నల్లమందును వాడునప్పుడు జాగ్రత్తగవాడవలయును. కనుక మాత్రలలోకలియు నల్లమందు మోతాదు రెండుమూడు ఆవగింజలప్రమాణముకు హెచ్చులేకుండ యుండవలయును. వేపజిగురుసేవనవలన ఇంద్రియస్ఖలనము కట్టును. వేపజిగురు నీరుతో మూత్రనాళమును పిచికారితోగడిగిన మూత్రద్వారము నుండివచ్చు తెలుపు, సుద్దకట్టు నిలుచును. కొద్దిగ వేపజిగు

ములవరకు సేవించవచ్చును. దీనిసేవనవలన శరీరారోగ్యము వృద్ధియై చర్మము, అన్నాశయము శుభ్రపడును.

### వేపాకు గుల్కండు

లేత వేపాకునందు పటికపంచదారనుంచి ఒక జాడీయందు కొన్నిదినములు భద్రపరచిన నది గుల్కండమాదిరి తయారగును. వేపాకుతోకూడ రోజామొగ్గలను చేర్చిన శ్రేష్ఠముగనుండును.

### వేపాకు లేహ్యము

లేతవేపాకును దూసి ఈనెలు పుల్లలు తీసివేసి శుభ్రపరచి ఆకును ఒకకుండయందుంచి ఆకులుమునుగునంతపైన నాలుగంగుళముల నీరునుబోసి మెత్తగఉడికించి నీరంతయు వంచివేయవలయును. సదరుఉడికిన ఆకుకు రెండింతలు చక్కెరను తీసికొని తీగపాకముగ కాచి ఆకునందుపోసి లేహ్యపాకముగ వండవలయును. ఈలేహ్యమునందు కస్తూరి, అంబరు, కుంకుమపువ్వు, ఏలకుల పొడిని కలిపి జాడీయందు భద్రపరచవలయును. పూటకు 1, 2 తులములచొప్పున దినమునకు రెండుపూటలు సేవించ నగును. దీనివలన రక్తశుద్ధి, వీర్యవృద్ధికలిగి మంచికలిని పుట్టించును.

వేపాకుకషాయము ఆడవారికికలుగు మూర్ఛరోగమును కుదుర్చును. వేపాకు స్వరసమున కొద్దిగఉప్పునుకలిపి సేవించిన కడుపులోని పురుగులునశించును. ఆకుపసరునందు తేనెగలిపి యిచ్చిన పాండురోగము, చర్మరోగములు మానును. వేపాకు

పసరుపావుతులము ఉసిరికకాయల స్వరసము పావుతులముకలిపి అందులో కొద్దిగనెయ్యివేసి త్రాగించిన తీట, పొక్కులు, గడ్డలు నెమ్మదించును. ఆకులకు సమముగ నువ్వులనుగలిపి నూరి కట్టు కట్టిన దుష్టవ్రణములు మానును. ఆకునునూరి స్త్రీలరొమ్ములకు పూసినను ఆకునువాడ్చి రొమ్ములకు కట్టినను స్తన్యముహరించును. వేపాకును నేతిలోవేసికాచి అందులో మైనమునుగూడ వేసి కరిగినపిమ్మట వడియగట్టి పళాస్త్రిగాచేసి వాడిన మొండి వ్రణములుమానును. ఆకునువాడ్చి వత్తడమిచ్చిన మేహవాతపు నొప్పులు, మాంసగ్రంథులు కుదురును. వేపాకును కాల్చి బూడిదచేసి అందు నెయ్యిగలిపి గజ్జికురుపులనుపూసిన నవి మానును. వేపాకును పసుపులోనూరి నూనెగలిపి ఉడికించి పూసిన స్ఫోటకపుకురుపులు, యితర చర్మవ్యాధులుమానును. చేతులయందు లేచు తీటకురుపులను వేపాకును ఆముదమునందు కలిపి వాడ్చికట్టినమానును. వేపాకు కషాయము పుండ్లను కడుగుటకు మంచియుపకారి. ఈకషాయము కార్బాలిక్ లోషను వలె పనిచేయును. ఆకుపసరుకు సమముగ కొబ్బరినూనెనుకలిపి పసరుయిగురువరకు తైలమునుకాచి వడియగట్టి చర్మవ్యాధులకు, కీళ్లనొప్పులకువాడిన నివర్తించును. ఆకుపసరు పూటకు రెండుతులములు మొదలు అయిదుతులములవరకు సేవించవచ్చును. వేపచిగురు మోతాదు పాతికతులము మొదలు అర్ధతులమువరకు సేవించవచ్చును.

## వేపపట్ట

కషాయముకాచుటకు చూర్ణముచేయుటకు వేపమాను పట్టకంటె వేపవేరుపట్ట శ్రేష్ఠము. వేపవేరుపట్టయందు సీర్యము జాస్తిగనున్నది. ముదురువేపపట్టను చక్కగనలియగొట్టి కషాయమున కుపయోగించవలయును. పదితులములపట్టకు 8 శేరు నీరుపోసి పాతికభాగము యినుకువరకుకాచి వడియగట్టి ఉపయోగించవలయును. ఈకషాయమును తడవకు 5 తులములు మొదలు 10 తులములవరకు త్రాగవచ్చును. చితుకగొట్టిన వేపపట్టను చక్కగ ఎండబెట్టి చూర్ణించి వస్త్రఘాళితముపట్టి గ్లాసుబుడ్డిలో భద్రపరచవలయును. ఈచూర్ణమును తడవకు కాలుతులము మొదలు ముక్కాలుతులమువరకు సేవింపవచ్చును. వేపపట్టను బూడిదచేసి వ్రణములమీదచల్లిన "బోరిక్"పౌడరు మాదిరి వ్రణములనుశోధించును. రెండుతులముల వేపపట్టను చక్కగ నలియగొట్టి పాత్రయందుంచి పావుశేరునీళ్లుపోసి రాత్రియంతయు నాననిచ్చి ప్రాతఃకాలమునవడియగట్టి లోపలికి పుచ్చుకొనిన ఆమాశయమును శుద్ధిచేసి మలబద్ధకమును పోగొట్టును.

## వేపపువ్వు

వసంతకాలారంభమున వేపచెట్లుచిగిర్చి పువ్వుపూచును. నిండుగపూచిన వేపచెట్టును చూచుటకు కనులపండువుగ నుండును. విచ్చినవేపపువ్వు సువాసనగలిగి మనోహరముగ నుండును. చక్కగపూచిన వేపచెట్టునీడ ఆరోగ్యమును, ఆనంద

మును గలిగించును. ఆరోగ్యమునకు, ఆత్మశుద్ధికి ప్రతిసంవత్సరాది పండుగనాడు నింబకుసుమభక్షణము హిందువులకు ఆరోగ్యమార్గము. క్రొత్తవేపపువ్వును పదితులములను ఒకపాత్రయందుంచి పూలుమునుగునటుల మసలకాగునీరునుపోసి మూతపెట్టి శాఫీకషాయమును తయారుచేసినటుల చేయవలయును. ఒక గంట కాలమువరకు కషాయము ఊరుటమంచిది. పిమ్మట వడియగట్టి వాడవలయును. ఈకషాయమును పూటకు 5 తులములు మొదలు 10 తులములవరకు సేవించవచ్చును. దినమునకు రెండుమూడు పర్యాయములు త్రాగవచ్చును. వేపపువ్వు రోజాపువ్వు సమభాగములుగ తీసుకొని అందు పటికపంచదార పొడిని కలిపి అప్పుడప్పుడు కొద్దిగ నేతినివిడిచి కొన్నిదినములు యెండలో నుంచిన నది గులకందయగును. దీనియందు కొద్దిగ కుంకుమపువ్వునుకూడ కలిపిన శ్రేష్ఠము. ఇట్లుతయారుచేసిన గులకందను పూటకు ఒకటిరెండు తులములు సేవించనగును.

### వేపపువ్వు ద్రావకం

(యునాని) వేపపువ్వు 1¼ వీశె, చక్కెర 2½ వీశె, పచ్చి ద్రాక్షపండ్లు 100, సీమసక్కరుపండ్లు 50, గంగరేగుపండ్లు 50, వలకులు ¼ పలం, తెల్లతామరపువ్వు ½ పలం, గావుజబాన్ (గోజిహ్వా = ఎద్దునాలుకచెట్టుఆకు) ½ పలం, ఉస్తుకదూస్ (హిందీ) ½ పలం, కాసినివిత్తులు 3½ పలం, సుగంధిపాలవేరుబెరడు 3½ పలం, రోజాపువ్వు 3 పలం, జన్ఫషా

**(Viola odarata)** 3 పలం, గాజుబాఁ పువ్వు 3 పలం, సూరత్ కరక్కాయ 3 పలం, నారదబ్బచిగుళ్లు 3 పలం, గేదంగి రేకు (కేతకి=మొగలిపూవు) 6 పలం, ఎఱ్ఱతామరపువ్వు 6 పలం, సాలామిశ్రి 6 పలం, రక్తచందనం 6 పలం, శ్రీచందనం 6 పలం, ఈవస్తువులలో పదివళ్లునీళ్లుపోసి నాలుగు గంటలకాలము నాన నిచ్చి ద్రావకముతీయు బట్టియందుంచి (**Distiller**=వాలుకా యంత్రము) మూడువళ్లు ద్రావకమును దించి సీసాలోపోసి భద్ర పరచవలయును.

ఈద్రావకమును మొదటి మూడురోజులు నాలుగుతుల ములు, నాల్గవదినముమొదలు యెనిమిదిదినములవరకు ఐదు తులములు, అంతకుపైన మూడుదినములు ఎనిమిదితులములు, తర్వాత మూడుతులములచొప్పున సేవించిన కుష్ఠు, తీట మొదలగు చర్మవ్యాధులన్నియు నివర్తియై రక్తమును శుద్ధి చేయును.

హిందువులు వేపపువ్వును పచ్చడిగను పులుసుగను తయారుచేసుకొని ఆరోగ్యమునకు భుజించెదరు. చారు, పులుసు మొదలగు ద్రవపదార్థములయందు వేపపువ్వును సువాసనకు, రుచికి తిరుగబోతనువేయు యలవాటు హిందువులకు గలదు. కొన్నిప్రాంతములయందు పితృదేవతలకు ప్రీతిగ శ్రాద్ధదినము లలో వేపపువ్వును పచ్చడిచేసెదరు. వర్షాకాలమున వేపపువ్వు కలసిన పదార్థములనుసేవించిన ఆరోగ్యమును గలిగించును.

## వేపపుడకలతో దంతధావన

వేపపుడకలతో పండ్లుతోముకొనిన నాలుకదోషము పోయి చులుకను, చులకదనమును కలిగించును. వేపపుల్లలను మెత్తగనమలి పండ్లుతోముకొనిన పండ్లసందున క్రిములుచేరక పంటివ్యాధులు కలుగకయుండును. పుల్లను మృదువుగనమలని యెడల పండ్లసందులనుండి రక్తమువచ్చును. అనుదినము వేప పుల్లలతో పండ్లుతోముకొనుచుండిన దంతపటుత్వము చెడక యుండి నోటిదుర్గంధముకూడ పోవును.



## వివిధగ్రంథాభిప్రాయ

# సమీకరణము

౧

పాశ్చాత్యఓషధీశాస్త్రవేత్తలు 12 జాతుల వేపచెట్లు ఉన్నట్లు కనుగొనిరి. అయితే యీ 'నింబ' యను వేమునే (Melia Azadirachta) ఇండియన్ బ్రిటిష్ ఫార్మకోపియాలో చేర్చుకొని వాడుకొనుచున్నారు. ఈవేపచెట్టు ఐరోపాదేశములో అరుదగుటచే దీనిని వారు ప్రైడ్ ఆఫ్ ఇండియా (Pride of India) యని పిలుచుచున్నారు. అనగా ఈచెట్టు హిందూదేశమున జననమొందినందులకు హిందూదేశీయులు గర్వపడవలసియున్నదని వీరి యభిప్రాయము. ఇందువల్ల వేప చెట్టుయందు వీరికిగల యభిమానము వెల్లడియగుచున్నది. ఈ చెట్టుపట్టనుండి మార్గోసిన్ (Margosin) యను ముఖ్యమైన ఓషధీద్రవ్యమును తయారుచేసి పలువిధములుగ వాడు చున్నారు. నూలుగుడ్డలకు గట్టిరంగులు అద్దునప్పుడు వేప చముదును వాడుచున్నారు. పురుగులనుచంపు మందులలో వేప విత్తుల చూర్ణమును కలుపుచున్నారు. తలలోనిచుండ్రు, కొవి పేలు నశించుటకు వెంట్రుకలను వేపపిండిలో పులుముకొను వాడుక పాశ్చాత్యులకు గలదు. వేపబంకను వీరు నలుపిగను

లైన కార్యములకు వాడుకొనుచున్నారు. చర్మవ్యాధులకు తయారుచేయు సబ్బుబిళ్లలయందు వేపక్షారమును(**Margosaic acid**) కలుపుచున్నారు. క్రిమినాశనమునకు ఈక్షారమును పలువిధములుగ కడుపులోనికి ఇచ్చుచున్నారు. ఈక్షారముతో వ్రణములను శోధించుచున్నారు.

౨

వేపపట్ట విషమకవచ్చుజ్వరములందును, వరుసజ్వరములందును, బలహీనతయందును ఉపయోగింపబడుచున్నది. రక్తము శుద్ధిచేయుటలో ప్రసిద్ధికెక్కినది. కావుననే ఇది కుష్ఠురోగము, వాతరక్తము మొదలగు రక్తమునకుసంబంధించినవ్యాధులయందు ప్రసిద్ధిగాంచిన మందుఅయిఉన్నది. వేపచిగుళ్లు మిరియముల తోడను ఉప్పుతోడనుకలిపి నూరినముద్ద దీపనముకలిగించుటకును, క్రిములను సంహరించుటకును, కుష్ఠురోగమునందును ఈయబడుచున్నది. ఆకులరసము తేనెతోకలిపి కామిలారోగమునందును, క్రిములయందును ఈయబడుచున్నది. వేపగింజలు క్రిమిహరములైనవి, దేహతత్త్వమును మంచికిమార్చునవి. గింజలనుండితీసినచమురు క్రిమిసంహారగుణముగలది, ఉద్దీపనకారి. కుష్ఠురోగమునందు పైకిని, లోపలకునువాడుటచే మంచిగుణమిచ్చును. వేపచెట్టునుండిస్రవించుకల్లు రసాయనముగను కుష్ఠురోగమునందు మందుగను వాడబడుచున్నది. చిరకాలముగాఉండే సెగరోగములయందు ఉపయోగింపబడుచు

న్నది. వేపపట్టకషాయము పుండ్లనుకడుగుటకు ఉపయోగింపబడుచున్నది. వేపఆకులు అంటురోగమును పోగొట్టుస్వభావము కలవి. మఱియు మొద్దుబారినమాంసగ్రంథులకు, వాపులకు ఉడకబెట్టి కట్టుగాకట్టబడుచున్నవి. మశూచికముసంబంధమైన కురుపులయందు పసుపుతోకలిపి వేపఆకులునూరి ముద్దచేసి పట్టించుట సర్వసాధారణమైనదే. వేపచిగుళ్లు చన్నీళ్లతోగాని మంచునీళ్లతోగానికలిపి గిలకొట్టుటచే వచ్చునురుగు జ్వరము నందుగలుగు ఉష్ణాధిక్యతనుతగ్గించుటకు శరీరముపై పూయబడుచున్నది.

—*One Hundred Useful Drugs*.

## 3

మలేరియానుండికాపాడుటకై నివాసగృహములందు వేపచెట్టు పెంచబడుచున్నది. పుండ్లయందును, చర్మరోగములయందును వేపఆకులు కట్టుగా, మలాముగా, మఱియు ననేకవిధములుగా వాడబడుచున్నవి. నలగగొట్టబడిననీళ్లతోకలిపి ముద్ద చేసినవేపఆకులు మశూచికపుపొక్కులకును, ఇతరమైనబొబ్బలకును ఉపయోగింపబడుచున్నవి. కుళ్ళుపుగడ్డలుఎదుగుటకు, చీముపట్టిచితుకుటకు వేపఆకుల కట్టుగావాడుదురు. దుష్టవ్రణములయందు మెత్తగానూరినవేపాకుముద్దలో నువ్వుగింజలుకలిపి నూరివాడుట మిక్కిలి ఉపయోగకరముగనుండునని చక్రదత్తయందు చెప్పబడినది. వేపఆకులకషాయము నలుకులయందు,

వ్రణములయందుమానుటకును, అంటురోగములనుండి రక్షింప బడుటకును మంచిమందుఅగును. "మానని మొండిగజ్జిరోగము నందును, చీముతోగూడిన ఇతరమగు బొబ్బలయందును వేప ఆకులనుముద్దగాచేసి పై నివట్టించుటవలన ఆశ్చర్యకరమగుగుణ మునుకలిగించును" అని డాక్టరు వైట్‌గారు చెప్పుచున్నారు. పెక్కురుఐరోపియనువైద్యులు మొండిచర్మవ్యాధులకు,వ్రణము లకు స్థానికమగుమందుగా వేపఆకులనుగూర్చి చెప్పియున్నారు. వేపగింజలనుండితీయబడిన చమురు వివిధరోగములయందు వాడ బడుచున్నది. కుష్ఠురోగమునందు ఇది చాలఉపయోగకరమైన దనియు, గండమాలరోగముచేగలిగిన గ్రంథులను చీముపట్టించు టకు అనుకూలమైనది అనియు చెప్పబడినది. కుష్ఠురోగమునందు పైపూతమందుగా వేపచమురు నీరుడువిత్తులనూనె (Chaul-mugra) మానునూనె (woodoil or gurjun చమురు) లతో కలిపివాడబడుచున్నది. వేపనూనెయందు గంధకపుపాలుగలదు. కొద్దిగంధకపుపూతవలన ఉపయోగముగలుగు చర్మగతరోగము లందును, కీళ్లనొప్పులయందును వేపనూనె-గంధకపుపాలు గలది యగుట - మిక్కిలి ఉపయోగముగనుండగలదు. వేపనూనె విస ర్పము నందును చర్మరోగములందును ఉపయోగకరమైనది- పైపూతలకు ఉపయోగించు వేపసంబంధమైన క్రియలివి.

ఇక లోనికితీసికొనదగుక్రియలవిషయము. వేపపట్ట చేదై నది, రసాయనము, వగరైనది, జ్వరహారమైనది. సమానమగు

ఓషధీగుణముగలవస్తువులతో కలుపబడి వేపపట్ట జ్వరములందీయబడుచున్నది. సాధారణముగ కషాయముగ ఈయబడుచున్నది. వేపఆకులు గాఢమగు చేదుగుణముకలవి. ఈఆకులకషాయము మందగించిన కాలేయముతోగూడిన విషమనిజ్వరములందు బాగుగపనిచేయును. వేపఆకులరసము క్రిములనుహరించుటకు లోపలికీయబడుచున్నది. ఈరసము కామెల, కురుపులయందు కూడ వాడబడుచున్నది. వేపపండ్లు విరేచనముచేయునవిగను, మార్దవకరమైనవిగను, క్రిమిహరమైనవిగను చెప్పబడినవి కాని విరివిగ ఉపయోగింపబడుటలేదు. వేపగింజలనుండి తయారుచేసిన చమురు కుష్టురోగమునందు లోనికి ఈయబడుచున్నది. పై పూతమందుగకూడ ఉపయోగింపబడుచున్నది.

*—Vegetable Drugs of India.*

౪

ఈఉపయోగకరమైనవృక్షము హిందూదేశమునందు సహజముగా పెరుగునది. పట్టకొఱకు, ఆకులకొఱకు, పండ్లకొఱకు ఇది హిందూదేశమునం దన్నిప్రాంతములందును పెంచబడుచున్నది. వేపపట్ట, ఆకులు, పండ్లు ఆయుర్వేదౌషధములందు బహుపురాతనకాలమునుండి వాడబడుచున్నది. వేపపట్ట చేదైనదిగను, రసాయనముగను, వగరైనదిగను ఎంచబడుచున్నది. జ్వరము, దాహము, అరోచకము, వాంతి, చర్మరోగము వీనియందు ఉపయోగకరమైనది. ముదురువేపఆకులు కరివేపకుబదు

లుగా కూరలయందు ఉపయోగింపబడుటగలదు. ఇతరశాకములతో కలిపి కూరగ కూడ వండబడుచున్నది. వేపఆకు కలుపుటచే కూరలకుగలుగు కొద్దిపాటి చేదువాసనయు, చిరుచేదును కొందరకు బహుప్రియముగానుండును. అదియునుగాక ఆకులు చర్మరోగములకు బహుపురాతనమును, జనసమ్మతమునైన మందుఅయి ఉన్నది. వేపపండ్లు విరేచనగుణముకలవి, మూర్ధవకరమైన గుణముకలవి. పేగులలోని క్రిములను నాశనముచేయుటయందును, మూత్రరోగములందును, మూలరోగములందును ఇవి చాల ఉపయోగకరమైనవి. వేపగింజలనుండి తయారుచేయబడిన నూనె చర్మరోగములందును, కురుపులయందును వాడబడుచున్నది. వేపపట్ట సమానగుణముగల ఓషధులతో కలుపబడి కషాయముగ చేయబడి జ్వరములందు వాడబడుచున్నది. ఉదాహరణముగ అమృతాష్టకకషాయమునబడు వస్తులివి: వేపపట్ట, తిప్పతీగె, కటుకరోహిణి, తుంగముస్తలు, కొడిశపాలవిత్తులు, చేదుపొట్ల, శొంఠి, రక్తచందనము దినుసు ఒక్కొంటికి కాలు తులముచొప్పునగ్రహించి అరశేరునీళ్లలో కలిపి నాలుగువంతులగునట్లు కాచవలెను. ఈకషాయమున తేనె, పిప్పలి చూర్ణము కలిపి కఫవికారముచేతను, పైత్యవికారముచేతను, వాంతి, అరోచకము, దాహము, ఆయాసము, దీనిచేతనుకలుగుజ్వరములందు ఈయబడుచున్నది. వేపఆకులపచ్చిరసము ఉప్పుతో కలిపి తేనెచేర్చి కామెల, చర్మరోగములందు ఈయబడుచున్నది.

ఉసిరిక, వేపఆకులరసము ఒక్కొక్కటి తులము చొప్పునగ్రహించి నేయికలిపి కుఱుపులు, శీతపిత్తముయందును ఈయబడుచున్నది. చర్మరోగములందు ఉపయోగింపబడు పంచతిక్తఘృతము, పంచనింబగుటిక, పంచనింబకషాయము మొదలగు ఔషధములందు వేప యొకప్రధానమైన ఓషధియైయున్నది. పంచతిక్తఘృతమునందుబడు ఓషధులివి: వేపపట్ట, చేదుపొట్లఆకులు, వాకుడు, తిప్పతీగె, అడ్డసరముపట్ట ఒక్కొక్కటి ఎనుబదితులములుగ్రహించి అరువదినాలుగుసేర్లనీళ్లయందు చతుర్థాంశము మిగులునట్లు కాచవలయును. ఈకషాయమునువడబోసి నాలుగుసేర్లనేతియందుబోసి ఒకసేరు త్రిఫలకల్కమునుకలిపి యథాపాకవిధిని ఘృతముతయారుచేయునది. మూడుమొదలు ఆరుమాసములవఱకు దుస్తరమైన చర్మవ్యాధులయందు దీనిని వాడుదురు. పుండ్లకు, చర్మరోగములకుపై పూతమందుగా వేపఆకులు ముద్దగా, పట్టుగా, కట్టుగావాడబడుచున్నవి. వేపఆకులు, నువ్వులు సమభాగములుగకలిపి తయారుచేసినముద్ద దుష్టవ్రణములకు మందుగా చక్రదత్తచెప్పుచున్నది. వేపనూనెసహాయమున తయారుచేయబడిన ఈక్రిందితైలవిశేషము పలుపుండ్లుగల గండమాల గ్రంథులనుండిచీము వెలికిదోయుటకు పలువురు గ్రంథకర్తలచే చెప్పబడినది. నాలుగుసేర్లవేపనూనెగ్రహించునది. దినుసుఒక్కొంటికి ఎనిమిదితులములచొప్పున తాళకము, మణశిల, జీడిగింజలు, ఏలకులు, అగరు, చందనము, జాజిఆకులు.

కాలానుశారిబ గ్రహించి కల్కముచేసి పదహారుసేర్ల నీటిలో కలిపి సంగ్రహించియున్న వేపనూనె నిందుచేర్చి తైలపాకవిధిని తైలము తయారుచేయవలయును.

—*The Materia Medica of the Hindus.*

౫

మగవారిసాయము లేక స్త్రీలు, పిల్లలు ఒంటరిగ ప్రయాణముచేయునప్పుడు అట్టిస్త్రీల చెంతను, పిల్లలచెంతను వేపాకు లుంచుదురు. వారు వానిని తమ చొక్కాజేబులలోగాని చీర కొంగులనుగాని ముడివైచుకొనెదరు. దుష్టగ్రహములు గుండె నిబ్బరముగల పురుషులను తాకవనియు; అబలలను, అనుభవము లేని పిల్లలనుపట్టి పీడించుననియు మనవారినమ్మకము. దుష్ట గ్రహపీడ తొలగించుటయందు శక్తిసంపన్నములుగా మనవారు భావించు వేపాకులు ఒంటరి ప్రయాణములందు స్త్రీలదగ్గర శిశువులదగ్గరనుంచుట రక్షకోపాయముగ నెంచబడుచున్నది. వేపాకులయందు క్రిమినాశకగుణము గలదనియు; రోగములు పెక్కు క్రిములవలననే గలుగుచున్నవనియు అధునికశాస్త్ర వేత్తలుకూడ ఒప్పుకొనియున్నారు కాబట్టి మన ఈపై ఆచారము అంత త్రోసివేయదగినది కాదని నమ్ముటకు అవకాశముగలదు.

—*South Indian Customs.*

౬

ఒకఊరు. ఆఊరిలో ఒకభార్య, ఒకభర్త. భర్తఒకసారి కార్యార్థియై విదేశములకు పోదలచెను. మగనిని మనసార

ప్రేమించిన ఆయిల్లాలు అతనిని విడిచి ఉండనొల్లదయ్యెను. మగని ప్రయాణ మెటులయిన ఆపివేయవలెనని తలచెను. ఆపివేయ జాలకపోయిన యెడల అథమపక్షము అతడు త్వరలో ఇంటికివచ్చు నట్లయిన చేయవలెనని సంకల్పించెను. ఈవిషయములో ఆమె ఒక పెద్దముత్తయిదువతో ఆలోచనసాగించెను. ఆపెద్దముత్తయి దువ ఈమెతో 'నీమగడు ప్రయాణముమానని యెడల అతడు పోవు నప్పుడు చింతచెట్టుక్రింద మాత్రము నిద్రించునట్లును, వచ్చు నపుడు వేపచెట్టుక్రింద నిద్రించునట్లును వాగ్దానము చేయించు కొనుము. ఇట్టివాగ్దానముచేయించుకొంటివేని నీమగని పునర్దర్శ నము నీకు శీఘ్రకాలముననే కాగలదు' అనిచెప్పెను. ఈఇల్లాలు మగనినుండి అట్టివాగ్దానమును పొందెను. మగడు ప్రయాణమై పోయెను. భార్యకుచేసిన వాగ్దానము ప్రకారము అతడు కొద్ది రోజులకే రోగగ్రస్తుడయ్యెను. వెనుకనే ప్రయాణమును విర మించి ఇంటికి బయలుదేరెను. భార్యకుచేసిన వాగ్దానముప్రకా రము వచ్చుచు అతడు వేపచెట్టుక్రింద నిద్రించుచుండెను. కొద్ది రోజులకే అతడు రోగనిర్ముక్తుడయ్యెను. వేపచెట్టుక్రింద నివసిం చుట ఆరోగ్యప్రదమును, చింతచెట్టుక్రింద నివసించుట అనా రోగ్యకరమును అను జనవాక్యమునకు ఉపపత్తిగా ఈకథ కల్పింపబడియుండును. అడవికి పులియెట్టిదో రోగికి చింతచెట్టు అట్టిదని పెద్దలందురు.

—*Folk-tales of South India.*

౭

జ్వరము, మశూచికము మొదలగు రోగములచే బాధ పడువారికి వేపతోపులు మంచివనియు,కొబ్బరితోటలు సరముల నిస్సత్తువమొదలగు జబ్బులచే పీడింపబడువారికి మంచివనియు, శ్వాసకోశవ్యాధులచే కష్టపడువారికి కానుగ వృక్షములతో నిండిన ఆరామము మంచిదనియు హిందువులనమ్మకము. ఆధునిక శాస్త్రదృష్టిని చూచినచో ఈనమ్మకము నిరాధారమనుటకు వీలులేదు.

—*Gardening in India.*

౮

వేపచెట్టు ఆరోగ్యమును రక్షించునది, పెంపొందించునది. మలేరియాజ్వరము రాకుండ కాపాడునది. దీని పట్టయొక్క చేదురసాయనము, వగరైనది, వరుసజ్వరమును కట్టునది. ఈ విషయమును ఐరోపియను వైద్యులుకూడ ఒప్పుకొనియున్నారు. అట్లు ఒప్పుకొనిన వారిలో బార్తొలిమో, సోన్నరాట్ మొదలగు ప్రాచీనులేగాక వైటు, కార్నిషు, బిన్‌డవున్, ఫార్బిస్ మొదలగు ఇటీవలి పరిశోధకులును, వైద్యులునుకూడ గలరు. వారు వరుస జ్వరములందు సింకోనా, పాషాణములు ఎట్లు పని చేయునో వేపపట్టయు అట్లు పనిచేయునని నిదర్శన పూర్వకముగ కనుగొనియున్నారు. ఇటీవల తిరిగి పరిశోధనచేసి ప్రమో

గించి భోలానాత్, చిటేలి, పారీ, మాండల్, ఫ్రాన్లీ, రాయ బహాదూర్ ఘోష్ మున్నగు డాక్టరులు ఈమూలిక మలేరియా నివారణకు అమోఘమైన మందని నిర్ధారించిన విషయము దేశీయమూలికలను గూర్చిన కలకత్తా రిపోర్టులోగలదు. వేప పట్ట చూర్ణముచేసిగాని, రసము తీసిగాని, కషాయము కాచి గాని అహికజ్వరము, చలిజ్వరము మొదలగు వానియందును, సాధారణమైన నిస్సత్తువయందును, జ్వరము తరువాత కలుగు నీరసమునందును, ఆకలిలేమియందును వాడుదురు.

కొద్దిగ ధనియాలు, శొంఠిగాని లవంగములుగాని లవంగ పట్టగాని చూర్ణించి కలిపియిచ్చిన క్వైనైన్ కన్న మంచిదని కొందరి అభిప్రాయము. దాహము, వాంతి, జ్వరమందలి వెగటు వీటియందు పట్ట వాడబడుచున్నది. చూర్ణముగగాని కషాయ ముగగాని చర్మవ్యాధులయందును వాడబడుచున్నది. మిరి యములు, నేలవేము వీటితో చేర్చబడిన పట్ట కషాయము జ్వర ములయందు సామాన్యముగ వాడబడుచున్నది. ఆమవాతకటి వాతములయందు 1 డ్రాము వేపపట్ట 2 డ్రాములు పిప్పళ్లతో తయారుచేయబడిన కషాయము ఉపయోగించుచున్నది. వేపపట్ట తుమ్మపట్ట సమభాగములుగ తీసుకొని కషాయము తయారు చేసి శ్వేతప్రదరము (తెలుపు)న వాడిన హితము. వేరుపట్ట నుండి తీసిన (tincture) కషాయము విషజ్వరములయందు

వాడబడినది. అనుగుణమును అందరు బడసిరి. దుర్గంధపు వ్రణముల కట్టుటకై (Carbolic oil) కార్బాలిక్ నూనెవలె, ఇంకను ఆమవాతములకు తలనొప్పులకుకూడ దీనినూనె వాడనగును. ధనుర్వాతము, కుష్ఠము, శీతపిత్తము, విసర్పము, విచర్చిక, గండమాల, చర్మరోగములు వీటియందు హితమైన పూత. నూనెయందలి Margosic acid నుండివచ్చు Sodium Margosate, Potassium Margosate చర్మరోగములయందు చాల ఉపయోగిమైనవి. కుష్ఠమున నూనెమాత్రముగాని, (Chaulmoogra oil) తువరకతైలముతో కాని వాడనగును. (Margosate) వీటిని సూచీముఖమున దేహమున ఎక్కించి (acid) ను పూతకుపయోగించిన నూనె వాడుటకంటె గుణము కనుబడుచున్నది. కుష్ఠమున, కొరుకువ్యాధియందునను వేపనూనె వాడబడుచున్నది. పేలను హరించుటయందు ఇది వాడబడుచున్నది. 5-10 చుక్కలు దినమున కొకమారు లేక 2 మార్లు విషజ్వరము, పురాణజ్వరము, కొరుకు, కుష్ఠుయందు వాడబడుచున్నది. 1½ డ్రాము క్రిమిహరముగ వాడబడుచున్నది. వేపనూనె 40 భాగములు, హరిదళము, మణిశిల, ఏలకులు, కలబందమూలము, చందనము, తగరము, చమేలి ఇవి ప్రత్యేకముగ ఒక్కొక్క భాగము, నీరు 100 భాగములు కలిపి తైలము కాచునది. గండమాలయందు స్రావమువరు యీతైలము చాల ఉపయోగకరమైనది. కుష్ఠు, అంత్ర

ములయందు పురుగులు, మూలవ్యాధి, మూత్రవ్యాధులు వీటి యందు పుండును సుగుణమును బడయుటకై వాడనగును.

ఎండిన విత్తనముల చూర్ణించి నీటితో గాని మరి యితర ద్రవములతో కాని కలిపి తీటయందు వాడిన నూనెవలె పని చేయును. కాగుజలమునకుపై వేపబడిన ఆకులుగాని, ఆకుల ముద్దగాని తేనెతో కలిపి కట్టిన గడ్డలు గ్రంథులు వ్రణములు దుష్టమైనవి హరించును. నేలవేము కటుకరోహిణితో తయారు చేయబడిన కషాయము జ్వరములయందు హితము. కార్బోలిక్ ఆసిడ్ ద్రావకమువలె మాన్పుగుణముకలదు. సెలుకులకు వాపులకు దుష్టవ్రణములకు దీనితో కాపడము చాలమంచిది. ఆకులు ప్రతిదినము తినిన సర్పవిషము హానిచెయ్యదు. వేపాకు 1 తులము, కర్పూరము ఇంగువ ప్రతిదొకటి 2 గురిగింజలు, 3 డ్రాములు బెల్లముకలిపి మాత్రచేసి నిద్రించునప్పుడిచ్చిన ప్లేగు కలరా మొదలగు వ్యాధులురావు. ఆకురసము క్రిమిహారము గను, కామిలచర్మ రోగములయందు ఇవ్వబడుచున్నది. కామిల యందు తేనెతో, చర్మరోగములయందు కరక్కాయతో వాడ బడుచున్నది. వేపాకులవలన తెల్లచీమలబాధ యుండదు. మసూ రికయందు ఆకులనూరినముద్ద లేపనకువాడబడుచున్నది. రోగి యొక్క ప్రక్కపై ఆకులనుపరతురు. ఆకులతో తయారు చేయబడిన వీవనలతో విసురుదురు. లేత ఆకులు, అతి మధు

రము కొద్దిగ నీరు వీటితో 5 గ్రెయినులఎత్తు మాత్రలచేసి దినమునకు 3 మార్లిచ్చిన మసూరికయందు చక్కగ పనిచేయును. పువ్వులు వేపాకు వీటినివాడ్చి కట్టినకట్టు దుష్టవ్రణములయందు చాల ఉపయోగమైనది. ఆకుల కషాయము యకృత్సంబంధమైన విషమజ్వరములయందు హితము. వేపకల్లు, క్షయ, అజీర్ణము, నిస్సత్తువ, కుష్ఠు, చర్మరోగములయందు చాల విలువగలది. లేతపుల్లలు దంతధావనమున కుపయోగించిన నోటియందలి దుర్గంధము హరించును. దంతపటుత్వము కల్గును. పంచనింబగుటికెస, పంచతిక్త ఘృతము అను ఔషధములు కుష్ఠున, చర్మరోగములయందు వాడబడుచున్నవి.

—*The Indian Materia Medica.*



వేము కలసిన

# ఆయుర్వేద యోగములు

## పంచనింబ చూర్ణము

వేపవేరు, వేపాకు, వేపపండ్లు, వేపపువ్వులు, వేపపట్ట ఈ యైదువస్తువులను చక్కగ యెండనిచ్చి చూర్ణమును తయారు చేసి సేవించిన తీటమొదలు కుష్ఠువరకు నివర్తియగును. ఈ చూర్ణముయొక్క మోతాదు రోగిబలానుసారమును గమనించి సేవించవలయును.

—రసరాజీయము

మేహవ్రణములకు, చర్మవ్యాధులకు గంధకరసాయనమును వాడునప్పుడు ఈపంచనింబచూర్ణమును అనుపానముగా నిచ్చిన వ్యాధులు త్వరలో కుదురును.

## అమృతాష్టక కషాయము

వేపపట్ట, తిప్పతీగ, కటుకరోహిణి, తుంగగడ్డలు, కొడిశపాలవిత్తులు, చేదుపొట్ల, శొంఠి, రక్తచందనము వీనిని ప్రతి దానిని కాలుతులమును దీసుకొని, చక్కగ నలియగొట్టి అర్ధశేరు నీరుపోసి నాల్గవభాగముకషాయము మిగులునటుల కాచి వడియగట్టి అందు తేనెనుగాని పిప్పలిచూర్ణమునుగాని కలిపి సేవించిన కఫజ్వరము, పిత్తజ్వరము, వాంతి, అరోచకము, దాహము అలసట నివారణయగును.

—శార్ఙ్గధర.

## పంచతిక్తఘృతము

వేపపట్ట, చేదుపొట్ల, వాకుడువేరు, తిప్పతీగె, అడ్డసరము ఈవస్తువులను ప్రతిది 80 తులముల ప్రమాణము తీసుకొని నలియగొట్టి 64 శేర్ల నీళ్లలో వేసి నాలవభాగము మిగులునట్లు కషాయమునుగాచి వడియగట్టవలయును. ఈకషాయములో నాలుగు శేర్లు ఆవునెయ్యిని ఒకశేరు త్రిఫల కల్కమును (కరక, తాండ్ర, ఉసిరిక) కలిపి ఘృతమునుగాచి వడియగట్టి భద్రపరచవలయును. ఈఘృతమును ప్రాతః ఒకతులము మొదలు ఒకటిన్నరతులములవరకు సేవించిన కుష్ఠుచర్మవ్యాధులు అతిశీఘ్రముగ నివర్తించును.

—చక్రదత్త.

చీముపట్టిన వ్రణములకు వేపాకు నువ్వులు సమముగ నూరి పట్టించిన వ్రణములను శోధించి మాన్పును.

—చక్రదత్త.

కాశకము, మునిశ్శిల, చేదువిత్తులు, ఏలకులు, నల్లమండ మట్టి, శ్రీచందనము, బావంచాలు, గురివిందవిత్తులు, ప్రతిది ఎనిమిది తులములనుతీసుకొని మెత్తగనూరి 16 శేర్ల నీళ్లలో గలిపి నాలుగు శేర్లు వేపవిత్తులనూనెను కలియబోసి తైలము కాచవలయును. ఈతైలమును "సర్వశోధిని" వ్రణమునకు వాడవలయును. సర్వశోధిని అనేకగ్రంథములలో మొదటిమాట లేదు మహాప్రణము అనగా కురుపులారునిదేను.

—భావప్రకాశ.

## గృహలక్ష్మీ కార్యాలయమున

# వెలకు దొరకు గ్రంథములు

## తులసి

గ్రంథకర్త డాక్టరు కే. యస్. కేసరిగారు. తులసియను గాంగేయ మూలికను గూర్చిన యమూల్యగ్రంథము. తులసియందలి భేదములు, తులసిని గూర్చి వైద్యశాస్త్రము చెప్పు వాక్యములు, తులసిదళములు తినుటవలన చచ్చుపోయి నిరచినవారు బ్రదుకుట, తులసివలన నయమగు వ్యాధులు మొదలగు విషయములేగాక తులసి పురాణమును, తులసి గోవింద నామములును, తులసి షోడశోపచార పూజయు, వివరింపబడియున్నవి. గృహస్థులెల్లరును ఈగ్రంథమును చదివి తులసివలన బొందదగిన సౌఖ్యలాభము లను పొందుదురుగాక. శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ఈగ్రంథమునకు చక్కని పీఠిక వ్రాసియున్నారు. పత్రికలు, ప్రముఖులు ప్రశంసించియున్నారు. క్రౌనుసైజున మంచి గ్లేజుడు వెయిటు కాగితము. 72 పుటలు. రేపరుబైండు. వెల రు. 0-8-0 పోస్టేజి ప్రత్యేకము. మొదటి కూర్పుప్రతులు చాలకొద్దిగా నున్నవిగాన వెంటనే ఆర్డరుపంపుట మంచిది.

## బిల్వ

ఇదియు డాక్టరు కే. యస్. కేసరిగారు వ్రాసినదే. బిల్వమునుగూర్చిన శాస్త్రవిషయక పరిశ్రమ చేసికూర్చిన సర్వవిషయములు ఇందుగలవు. ఈ మూలిక ఔషధీగుణము, వైద్యప్రయోగములు, శాస్త్రచర్చ, పురాణవివరము సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు భక్తులకు మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథము. పత్రికలు మెచ్చినవి. క్రౌనుసైజు. మంచి గ్లేజుడు వెయిటు కాగితము. 48 పుటలు రేపరుబైండు. వెల రు. 0-8-0 పోస్టేజి ప్రత్యేకము.

# కేసరి రత్నత్రయము

## "లోధ్ర"

### గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు ఋతుకాల బహిష్టి కాకుండుట, అకాల బహిష్టి, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కాళ్ళనొప్పులు, అరికాళ్ళు అరిచేతులు మంట మొదలగు స్త్రీమర్మవ్యాధులను కుదుర్చును.

స్త్రీలపాలిటిది వరప్రసాదమనిన్ని, కల్పవృక్షమనిన్ని, రత్నఖచిత యాభరణమనిన్ని, సర్వాభీష్టప్రదాయినియనిన్ని, పలువిధములుగ స్తోత్రము చేయుచున్నారు

పెద్దబుడ్డి 12 ఔన్సులు రు. 3-0-0. చిన్నది 6 ఔన్సులు రు. 1-10-0.

## "అమృత"

### రక్తశుద్ధిప్రదాయకము

[illegible] రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్ళనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, నరముసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట, మొదలగు వ్యాధులను నివారించుట శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సును యిచ్చును. ఈ మహత్తైన యౌషధమువలన నెందరో యారోగ్యవంతులైనారు.

పెద్దబుడ్డి 12 ఔన్సులు రు. 3-0-0. చిన్నది 6 ఔన్సులు రు. 1-10-0

## "అర్క"

### సర్వజ్వరనివారిణి

ఆహార, విహారముల భేద దోషంబులవలన అన్నాశయమునందు క్రిమికీటములు చేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాత జ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, సన్నిపాతజ్వరము, మరి యితర విషజ్వరములను, కడుపులో ప్లీహము జ్వరగడ్డను, కుదుర్చును.

6 ఔన్సుల బుడ్డి రు. 2-8-0. 3 ఔన్సుల బుడ్డి రు. 1-8-0

1 ఔన్సు బుడ్డి రు. 0-8-0.

# "లోధ్ర"

శ్రీమతి ఓ. వయిత్రి పులవర్తి కమలావతీదేవిగారు, రాజమండ్రి:—నా సోదరి బహిష్టియందు కడుపునొప్పిచే చాల బాధపడుచుండెడిది. తమ "లోధ్ర"ను మూడుబుడ్లను తెప్పించి ఆమెకొసంగితిని. నా చెల్లెలు స్వస్థురాలగుటయే గాకుండ నిరువురు బిడ్డలనుకూడ కనినది. తమ లోధ్ర స్త్రీల పాలిటి వరప్రసాదినియనుట కెట్టి సందియమును లేదు. మా స్త్రీల వ్యాధులకు తమలోధ్ర కల్పవృక్షమువలె కన్పడుచున్నది."

* * *

శ్రీమతి ఎన్. కనకమ్మగారు, C/o నరసయ్యగారు, విలేజిమాజిస్ట్రేటు, కదిరి:— "మీ లోధ్ర 4 పెద్దబుడ్లను సేవించినాను. 4 నెలలనుండి కడుపునొప్పిబొత్తిగ నిలచి పోయినది."

* * *

శ్రీమతి డి. రాజరాజేశ్వరమ్మగారు, శారదానిలాన్, దిగువపాలెండి, గంజాంజిల్లా:—

"నాసహోదరి బహిష్టకాలమునందు మితిలేని కడుపునొప్పిచే మిక్కిలి క్షీణించినది. ఎన్నిమందు ఔషధము లిప్పించితిమిగాని నయముకాలేదు. తుదకు తమయొక్క 'లోధ్ర' [illegible] రెండు బుడ్లు తెప్పించి నాసోదరికి వాడినాను. అత్యాశ్చర్యముగ గుణమిచ్చినది. మరియు ఆమెకొక సుపుత్రిక జననమైనది. ఈసంతోషవార్త తమకు వెల్లడించుచున్నాను.'

# "అమృత"

శ్రీ రాజా రామచంద్రసూర్ హరిశ్చంద్రదేవుగారు, తర్లరాజు:—"కొంతకాలముకు పూర్వము మీరు పంపిన అమృత చేరినది. మంచిగుణమిచ్చునట్లు తోచుచున్నది. మరి కొన్ని బుడ్లను వాడదలచినాను."

*　　　*　　　*

ఏ. సూర్యనారాయణరావుగారు, బి.ఏ.బి.ఎల్., విశాఖపట్టణము:—"ఈ యోగ్యతాపత్రము తమకిచ్చుట నావిధి. దీనిని మీరు మీ కేటలాగునందు వేయవచ్చును. మొట్టమొదట నేనువాడినది మీ అమృతను. ఇప్పటికిసుమారు రెండేండ్లయినది. తలచుకొనగా అమృత చల్లని, రుచికరమగు బలవర్ధకౌషధమని జ్ఞాపకమునకువచ్చుచున్నది. పిమ్మట మీ అరిష్టమును, జ్వరములకువాడి లాభముపొందితిని. మీ లోధ్ర నాకుటుంబమునందలి యొకస్త్రీకియివ్వగా బుతుశూలకుదిరి గర్భముదాల్చినది."

*　　　*　　　*

కె. వి. నాయుడుగారు, ఎ. ఎస్. ఎం. డి. మెడికలు ఆఫీసరు; జటప్రోలుసంస్థానము:—"జటప్రోలుమహారాజుగారి అనుమతిప్రకారము మీ అమృతద్రావకము చక్కగపనిచేసినదని వ్రాయుచున్నాను. మొదటిబుడ్డివలన కల్గిన సుగుణములను చూచి మరియొకబుడ్డి ఆ రోగికి వాడినాము. గుల్మము, కడుపులోమంట, మలబద్ధము, బలహీనము, తలనొప్పి మొదలగునవిఅన్నియు మొదటిబుడ్డి వుపయోగింపగనే తగ్గినవి."

# అర్కా

ఏ. విశ్వనాథపిళ్ళెగారు, ఎల్.ఎం.పి; ఫిసిషన్, సర్జను; చామర్లకోట (గోదావరి):—"అర్కా మొట్టిజ్వరమునైనను పోగొట్టగల ఔషధరాజము. రోగచికిత్సయందు అనేకులకు అర్కానువాడగా గుణమిచ్చెను. కాలప్రవర్తి చక్కాగయుగు నట్లుచేసి, జ్వరపు ఉధృతమును తగ్గించును. జ్వరములకు సాధారణముగను, మలేరియాకు ముఖ్యముగను అర్కానువాడి మరణసంఖ్యను తగ్గింపుడని నాస్నేహితులను కోరుచున్నాను. శీఘ్రముగ ప్రసిద్ధికెక్కుటకు వైద్యులందురు అర్కాను యివ్వవలెను."

*　　*　　*

దివాన్ బహద్దూరు కే. యం. కృష్ణరావుగారు, గుంటూరు.—తమ 'అర్కా' వుపయోగించి జ్వరవిముక్తుడనైతిని. నాయింటియందు అందరు నుపయోగించుచున్నారు. ఇచ్చట చుట్టుప్రక్కలయందుండువారికి యిచ్చియున్నాను. వారికి నెమ్మదిగాయుండుటను విన చాల సంతోషమాయెను."

*　　*　　*

ఆర్. దొరసామిఅయ్యరుగారు, తహసీల్దారు, కందుకూరు:—"నేను కనిగిరిలో తహసీల్దారుగానుండినపుడు, 700 గ్రెయినుల క్వినైనును రెండునెలలలో మలేరియాజ్వరమునకు వాడితినికాని ఫలితములేదు. అర్కానువాడగనే జ్వరము నిలచినది."

# దంతధావన నవనీతము

సర్. ఎస్. రాధాకృష్ణనుగారు, వైస్ ఛాన్సలరు, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు:—"మీరు పంపిన కేసరి దంతధావన నవనీతమును కొన్ని దినములు వాడితిని. మిక్కిలి బాగుగనున్నది. స్వదేశీయోద్యమము చెలరేగు నీదినములలో యిది మిక్కిలి అమ్ముడు పోగలదని నా నమ్మకము."

జే. ఎస్. ఏ. రాజుగారు, ఎం. ఎ., ఇన్ కంటాక్సు ఆఫీసరు, మదరాసు:—"కేసరి దంతధావననవనీతమును వాడి చూచి అది మిక్కిలి ప్రసిద్ధిగన్నదని గ్రహించితిని. సాధారణజనుల నాకర్షించునది దంతములను శుభ్రపఱచు గుణమును, వాసనయు. ఈ రెండు గుణములయందును కేసరి నవనీతము శ్రేష్ఠమైనది. ఇపుడు బజారులలోనుండు యితర దంతధావన నవనీతములతో సరితూగునని నమ్మెదను."

వి. రాధాకృష్ణయ్యగారు, బి.ఏ.బి.ఎల్., వకీలు, మదరాసు:—"రెండు వారములుగ మీ దంతధావననవనీతము వాడుచున్నాను. ఆంగ్ల, అమెరికా మరి యితర విదేశీవస్తువులకు సరితూగుచున్నదని తెలుపుటకు సంతసించుచున్నాను.

# మాలతి

ఇది బాదంపప్పు పాలనుండి తయారుచేయబడిన యొక తెల్లటి సువాసనగల నవనీతమువంటిది. దీనిని స్త్రీ పురుషులు తల దువ్వుకొనుటకు ముందు కొద్దిగ రాచుకొని దువ్వుకొనిన వెంట్రుకలు తెగక పట్టుకుచ్చువలె మిసమిసలాడుచుండును. మెదడు చల్లబడి సుఖముగ నిద్రవచ్చును. ఇందు ముఖ్యముగ మాలతీ పుష్పముల అత్తరు చేరియున్నది. ఈ అత్తరు సొగసునకు సొంపునకు సుఖమైన సువాసనకు పేరు గాంచినది.

వెల బుడ్డి 1-కి 8 అణాలు.

# మాధవి

ఇది పుష్పసారములతో నిండియుండు ఒక నాజూకైన మంచువంటి పరిమళ పదార్థము. ఈ మంచును కొద్దిగ వ్రేలితో తీసికొని ముఖమునకు లేపనమును చేసికొనిన వెంటనే అది చర్మములో మాయమై ముఖమునకు కళ, కాంతి నిచ్చును. ముఖము స్ఫటికమువలె నిర్మలమగును. ముఖముపై లేచు పోటె, మచ్చలు, మొటిమలు మొదలగువాటిని మాన్పును. మరియు దీనిని ముఖమునకు పట్టించుకొనిన వెంటనే ముఖము చల్లగనుండి మంచు రాచుకొనినట్లే యుండును.

వెల బుడ్డి 1-కి 8 అణాలు.

# మల్లిక

ఇది ముద్దుబిడ్డలకు మురిపమైన లేపము. ఇది మైసూరు చందన అత్తరుతోను మల్లెమొగ్గల సారముతోను తయారుచేయబడిన నవీన నవనీతము. శిశువులకు దీనిని ప్రతిదినము స్నానానంతరము కొద్దిగ శరీరమునకు రాచుచుండిన చర్మము మృదువై బంగారురంగు నిచ్చి చర్మవ్యాధుల రాకుండ చేయును. ఈ లేపమువలన బిడ్డలు రబ్బరుచెండ్లువలె తేరుదురు. ఇందు కాశ్మీరపు కేసరి పునుగుకూడ చేరియున్నది.

వెల బుడ్డి 1-కి ౬ అణాలు

తిరువనంతపురము, హుబ్లీ క్షేత్రములయందు

అఖిల భారత వస్తుప్రదర్శనములలో

ప్రథమ తరగతి బంగారు పతకములను పొందిన

కే స రి

డెంటల్ క్రీము

అను

# దంతధావన నవనీతము



సువాసన మధుర పరిమళ మిళితము.

ఎల్లరు ఒకమారు రుచి చూడవలయును. దంతములను ముత్యములవలె చేయుటయేగాక పంటిజబ్బుల నన్నిటిని నివారించును. భారతదేశమున భారతీయునిచే భారతీయులకొరకు తయారుచేయబడినది.

అన్ని షాపులలో దొరకును:

అణాలు 8 మాత్రమే.

## కేసరి కుటీరం

ఆయుర్వేద ఔషధశాల, మదరాసు.

